బుచ్చన్నా !

ఎంతపని చేసావు ! చిరంజీవి నమశ్శివాయ కోరికపై 'ఒక లంబోదరుడైన పుత్రకుడు' అంటూ ఆషామాషీగా ఆరంభించిన దెల్లా—అగాధ తలాలనూ, ఉన్నత శిఖరాలనూ అంటి, అష్టోత్తర శతంచేసి, చివరకు 'ఏరో వెన్నెల చీకటుల్ గలసిన ట్లీ సర్వతా గ్రాన నున్నారే !' అంటూ మమ్మెక్కడికి తీసుకెళ్ళి వదిలావంటేనూ! నీ హాస్య తరంగాల అడుగున, ఇంతటి సంస్కార పరిణతీ, ఇంతటి శాంతరసగర్భమూ వున్నదనుకోలేదు. పంచవటితోనే తలమున్కలై, శబరితో కాలు నిలవద్రొక్కుకోలేకపోతున్న మాకు ఈ మృత్యుంజయుముతో 'నావంబోలి ప్రయాణమైనది మహానంద ప్రవాహమ్ములో భావం బెచ్చటికో !' మా బుచ్చయ్య యింతటి సంస్కార వృద్ధుడైనా, నువ్వు చెప్పినట్లు 'పెద్దంజేయ మనస్కరింపదు నిన్ను' మా యీ చనవును మన్నించవూ? 'ఆ ధావళ్యంతో కన్నులు పగిలిపోతూ' కూడా 'బాబుగారూ' అంటూ నవ్వుతూ ఎదురు వచ్చే నిన్నెప్పుడు కౌగిలించుకుంటానా అని యెదురుచూచే.

| | |
|---|---|
| 10—1—45 | మిత్రుడు, |
| మచిలీపట్టణం | కాటూరి వేంకటేశ్వరరావు. |

# మృత్యుంజయస్తవం

శ్రీ కైలాసనగాధివాస ! కరుణాసింధూ ! జగత్ప్రాణబం
ధూ ! కల్యాణగుణావహా ! సకలదుర్దోషాపహా ! దేవతా
నీకాభ్యర్చితపాదపంకజ ! భవానీనాథ ! గంగాసనా
థా! కైవల్యమయా! చతుర్నిగమగేయా! తండ్రీ! మృత్యుంజయా!

అకలంకా ! నిజమౌళ్యలంకృతమృగాంకా ! సర్వలోకైకనా
యక ! పాదాశ్రితపారిజాతక ! మునీంద్రారాధితా ! నాదబిం
దుకళాతీత ! సురాసురప్రకరపాధోజాతఖద్యోత ! సా
యకితాజ్ఞాతదశేక్షణా ! శరధితూణా ! తండ్రీ ! మృత్యుంజయా! 2

ఓ విశ్వేశ్వర ! ఓ నితాంతమధుపానోద్రిక్తమాతంగక
న్యావీణాస్వనదత్తచిత్తనటరాజా ! సుంత విన్పించుకో
లేవా మా మొఱ, యొక్కమాఱయినరాలేవా, యిటన్ మాపయి
న్నీవాత్సల్యమొకింతయున్ జిలుకవేనేలేవ, మృత్యుంజయా ! 3

ఆ కైలాసనగాన నీకు నొక నృత్యం బుండినన్ జాలునో,
లోకం బెంత యపోహలోనఁ బడెనో లోలోన నిన్ గూర్చి నీ
వాకర్మంబు నెఱుంగనే యెఱుఁగవా ? యార్తావనత్వమ్ము చేఁ
గాకున్నన్ విడియాకొసంగి తొలగంగారాదె ? మృ.... 4

మెడ నాగయ్యకు నొక్కచే బుసబుసల్, మేనన్ సగంబైనయా
బిడతో నీకేఁక నెప్పుడున్ గుసగుసల్, వీక్షించి మీచంద మె
క్కడలేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకున్, నీచెవిన్
బడుటేలాగునొ మా మొఱల్ తెలియదప్పా ! మాకు మృ.... 5

హరియే ముగ్ధతఁజెందవచ్చును త్వదీయాకారముం జూచి, లో
నెఱుఁగంజాలకపోవవచ్చు నిఁక బ్రహ్మేంద్రాదులే పూర్తిగా
బరమంబైన భవత్ప్రభావమును, లాభంబేమి ? మమ్మెంతగాఁ
గరుణింపంగలవన్న దొక్కటె ప్రసక్తంబయ్యె ! మృ.... 6

నీ చక్కందన మే మెఱుంగమినొ, రానేరావె యీకాలపుం
బోచాయింపులముం దిఁకెక్కడనియేమో జాడలేకుంటివే,
నీ చంద్రార్ధకిరీటసంస్మరణతోనే చొక్కుచుండంగ నీ
ఘావక్రం బిఁకఁ గొంకనేల విజయంబున్ జేయు మృ.... 7

నోటన్ బల్కఁగరాని పాపముల నెన్నో చేయుచున్నాఁడ, ఆ
మాటే పట్టదు నాకు, నీవయిననున్ బట్టించుకోనట్లె యీ
నాటన్‌గూడను గానపత్తు. ఇటునే నమ్మించి చేఁజిక్కఁనా
డేటన్ ముంతువో యంచు గుండెదిగు లౌనే తండ్రి! మృ.... 8

మెదలన్ బాప మొకొక్కఁటే మెవడున నేర్మెనెల్లఁ గంపించి గా
డిచ తన్నుల్‌గద గుండెలో నెవటో, నాడే నీవు కాదన్నచో
మొదలాజోక్యమెయుండఁబోదుగద, నీమోసమ్మె మోసమ్మురా
సొదగాఁ దేలిచివైచినావు సుధగాఁ జూపించి మృ.... 9

ఈ చిత్తమ్ము గురూపదేశ విధిగా నే నిల్పఁగాఁ జాల నా
ధీచక్రమ్మున, నిన్ను నేదొయొక చిద్బిందుస్వరూపమ్ముగా
నా చూపుం బఱిగింపఁజాలఁ, గరుణన్ నా ప్రాణలింగమ్ముగా
నా చుట్టుం దిపగాచు బిడ్డవయి యున్నంజాలు మృ.... 10

ఎడమీకుండగఁ బైన వచ్చిపడు మా యీ పాపపంకమ్ములన్
గడుగంగాఁ దలదాల్చుకొంటివటరా గంగామహాదేవి, నీ
యెడ దాకొల్పెడి మాదు పాపముల నీవెల్లప్డు శాంతిల్లఁజే
సెడుపొంటెన్ పదుణేందుశేఖరుఁడవై చెల్వాదె మృ.... 11

సిరిగాఁ బార్వతిగా సరస్వతిగ స్వాత్రీ రాణఁ జెన్నారఁగా
హరివై సాంబశివుండవై యజుఁడవై యాద్యంతశూన్యుండవై
చిరనూత్నంబుగఁ దేజరిల్లెడి నినున్ చిజ్జ్యోతి నీనాటి యా
త్మరుచిన్ నేనొక చంద్రచూడునిగనే ధ్యానింతు మృ.... 12

పరిపూర్ణంబయినట్టి నిర్గుణపరబ్రహ్మమ్ము పేరే చెవిన్
జొఱ దేచిత్రమొకాని, సుంత చెవికిన్ సోకంగ నీచంద్రశే
ఖరనామ మ్మొకయింతలో మనసుపొంగంజొచ్చు. నొక్కొక్క పై
ఖరిగా నొక్కొక్క బుద్ధి వర్తిలెడునుం గాదయ్య మృ.... 13

పెద్దంజేయ మనస్కరింపదు నినున్, బిడ్డన్ వలెన్ జూచుచున్
ముద్దున్ జేయుచు ముచ్చటాడుకొనుచు న్నూమ్రపండు సన్నోమ్రయుచున్
సుద్దుల్ సెప్పుచుఁ జెప్పిన న్వినుచు నింజొక్కించుచు న్జొక్కుచున్
ప్రొద్దుల్ పుచ్చుట లున్నఁ జాలు నిరతంబున్ గోర మృ.... 14

ఒక బిల్వార్చనయేని వీఁడెఱుఁగునో, యొక్కొక్కతే యొంటిమీఁ
దికి నిన్నేఁడుఱవచ్చి యొక్క శివరాత్రింగాని వీఁడుండెనో,
మొక మేలాగునఁజెల్లి వాఁడెఱచెడిన్ మోక్షమ్ము నిమ్మంచు నే
టికి నామ్రొక్కినమ్రొక్కె చాలుననుకొంటేతప్ప మృ.... 15

నరజన్మం బెటులిచ్చితో పశుపతీ, నాకంటెఁ బశ్వాదులున్
మెఱుఁగే యెన్నివిధాలఁజూచినను స్వామీ ! ముందు చేజాఱు నీ
పొరవాటున్ సవరించుకోనయిన సద్బుద్ధిన్ బ్రసాదింప, వి
స్తైఱ గా పాలన యిందెకాని మఱి యెందే కద్దె ? మృ ... 16

ఏఁ బైకిన్ దెగఁ బండితుఁడనని పేరేకాని నాలోని కేఁ
బోఁబోవంగను జెప్ప లజ్జయయిపోవున్ నేను నా బుద్ధికే
యే బొడ్డూడని బిడ్డనో యగుదుఁ దండ్రీ ! నిక్క మీపాటిదే
నాబండారము, త్రోవ నీ విడకయున్నం గాదు మృ.... 17

ఎఱుఁగన్ నిన్నవకాశ మెక్కడిది ముందీ ప్రమ్కుడ్నంబోవు నూ
పిరిసే ఎంత విశేష మున్నయదియో విశ్వప్రయత్నమ్మునన్
గుఱితింపంబడునాటికే ముగియవే సూతేఁడులుంగూడ, నే
విరమింతుం జతనమ్ము నీకునయి నీవే రావె మృ.... 18

ఒక లంబోదరుఁడైన పుత్రకుఁడు మున్నున్నట్టిదే నీకుఁ జా
లక కాఁబోలును సృష్టిఁజేసితివి యీ లంబోదరుంగూడఁ, దీ
గకుఁ గాయన్ బరువౌనకాని, కుడుముల్ గల్పించి యవ్వాని కే
లోకా యివ్వానికి నొక్కమైని యిడుమల్ మొల్పింతు మృ....19

నవరాత్రుల్ గద దేశమంతటను ఈనాఁడేని నాయింటిలో
శివరాత్రుల్ జరిగింపఁగావలెనె ? నే సేవించుటా దేవినే
యవునేనీ యిటు కూటికే మొగమువాయంజేయునే ? యాదిభి
క్షువుపీ వాయమ యన్నపూర్ణ మెటులౌకోఁ సాటి మృ.... 20

గజగర్భమ్మగఁ బైకిఁ గన్పడని నా కష్టాలఁ బోకార్పఁగా
నిజ మీ పౌక్కుఁడవే సమర్థుఁడవు కానీ యేమిలాభమ్ము, నీ
యజమానత్వముచేత నింటను 'మనుష్యాణాముకే' లేదుపో
'యజమానాయకు' నైన లేక తల దుబ్బైపోయె మృ.... 21

ఈ నాకే యనికాదు, నీకయినఁగానీ నేటి కాలానఁ బూ
ర్ణానుస్వారము ముష్టియేని కపనంబన్‌దాన, నన్నేటికె
పూన జేసితివో, ప్రమాదములు దేవుండేనియుం బొందునో.
నే నేమంచనుకోవలెన్ దెలుపవో నిన్‌గూర్చి మృ.... 22

ఏదో నీకొక దేవిగాని యిఁక నేవేవో సవాలక్ష లా
వాదేవీ లయిపోయె మాకు, జటుగుంబాపెట్టు, లే కొండనో
లేదా యే గుహలోనొ పట్టకొక జోలే దాగియుండంగ, మే
మే దేవుళ్ళమొ విశ్వమూర్తులమొ నీవే తెల్పు మృ.... 23

కొడుకుల్ కొమ్మలు గాక వేఱెవరు లోకుల్ ? పిరియుండెల్ల నీ
యెడ లేకుండిన క్షుత్పిపాస లస లెట్లేర్పడ్డవో ? శక్తియు
క్తుఁడవై యుండఁట నీవె దాకొలిపియుందో తెల్పవై తీపు, తు
మ్మెదు దీవించెదువాఁడు మాకు నొక మేమేకామ ? మృ.... 24

గాలిన్ మేయుచు సర్ప మాకలిని బోకార్చంగఁ. గుండేలు డా
కాలిఁ నాకుచు దాహ-మార్చికొనఁగాఁ, గాసంత లివ్వానికే
చాలన్ లేక జనుం డిఁకేమి యనుచున్ సంతోషవారాంబునిధిన్
దేలంగావలె సృష్టికెల్ల మొనగానింటోలె మృ.... 25

మేమీ భూమిని పొట్టకోసమయి ఏమేన్ జేసుకేనెప్పునే ?
ఏమీ నీకది లేకపోఁగఁ బయిగా నే పాపపుణ్యాలనో
ఈ మానెత్తిసవేసి ముద్దుటయి మేలే ? ఎందు కేర్పడ్డ హం
గామా ? ఆకలియున్న దెల్ల నటించంగారాదు ? మృ.... 26

బొక్కెండన్నము పుట్టఁబోవదు సరే, పూర్వార్జితంబేనియున్
దక్కంబోవదు ముక్కుమూసికొని పుణ్యంబంచు పాపంబటం
చిక్కాలమ్మునఁ బెట్టుకొన్నయెడ. నే దేయెత్తుఁబై యెత్తునన్
బొక్కంద్రోసెడువానిదే ప్రథమతాంబూలమ్ము మృ.... 27

ఉండంబోవనుగాని యుర్విపయి నున్నన్నిన్నాళ్ళింకఁ బ
ట్టెండన్నమ్మిన కెన్నొరోశలను గొట్టెన్ జేనెఁడాపొట్ట జి
ట్టెండౌనాల్కను గూడఁగట్టుకొని చుట్టెన్ బాఃముల్ తట్టుబం
డెం, డీజన్మము నిమ్మటంచు నెవఁడేడ్చెన్ దుండ్రి మృ.... 28

ఉండంగావచెనొక్కొ నీకొఱకె యేహో వెండిబంగారపుం
గొండల్ రెం, డొకఁడైన బిడ్డలకు మాకున్ బంచియీరాదొ, యొ
క్కండీ ల్గోక్కుఁడు చిల్లిగాఁగుదుర నీకున్ నిండెనే మాకు ఈః
గుండుల్ బండ వెడ్లొగొట్టితి పృథక్కుల్ మేలె? మృ.... 29

ఊళ్ళేయేలెనొ లేకయున్నయెడ నిం కూళ్ళూళ్ళలో నీళ్ళరా
విళ్ళేమోసెగొ మేరికిన్ పలసెడిన్, విత్తమ్ము చేనున్నచో
నాళ్ళన్నింటిని గూడఁదీసికొని గండాభిల్లుటున్ దాంతియా
భిల్లుల్ సైతము పిల్లులయ్యెదరు నువ్వే నేఁడు మృ.... 30

అల్లాగే చననీయకే తిరిగి నీ వామాటకే రాగ ఇ
ల్లిల్లే, నున్నకు నఃన్నె హాళ్ళికిని హాళ్ళేగాదె నీ శాంబరీ
భిల్లత్వమ్మును, దాని కెచ్చటనో నీవే దూరి యేనాడొ బి
స్మిల్లాకాగను రెక్కకొ జముక యీ మేమింక మృ.... 31

పల్లెత్తంగనె కళ్ళమంతపడు తుప్పర్లంచు లోనెంతువో
అల్లాకాదుర ఫక్తు రొక్కముర ఆ 'అల్లాడి' నిల్వంగనే
అల్లల్లాడుర అద్దియిద్దియటరా హైకోర్టత్రం డెంతరా !
యెల్లన్ నీవయికూడ రాలెడిది విత్తే లేదు మృ.... 32

మూవాడంగల పాలవాఁడు నయమే మానెందు వింకెన్నియో
గావించున్, మఱి చేతుపీ వయిన నొక్కం డిన్నిరూపాలుగా
ఈ వేదీ యటు కళ్ళఁజూడగలవే యేరోజు రొక్కమ్ముగ; నీ
దేవత్వమ్మున నేమి మృత్తికయుతేదే తంఁడ్రి మృ.... 33

నాకీనాటను జీవయాత్రకె టికాణాలేక నావల్లనే
లోకంబన్నది నిల్చియున్నదనుచున్ లోలోన నన్కొందునే,
నీకెట్టుల్ గుదిరెన్ జగం బఖిలముల్ నీదయ్యెఁ గానట్టులన్
నాకంటెన్ నిరుపేదగా మనెడి పంథా ! తంఁడ్రి మృ.... 34

నడువంగావలె వ్యాజ్యమందు నెదో గ్రంథం, బట్లు కాకుండినన్
నడుపంగావలె నేదో యౌషధమునైనన్ వ్యాధి, కీ రెండు నొ
క్కెడనే చొప్పడెనేనిఁ జెప్పవలెనే యెల్లప్డు పాల్ పెర్గు కా
విడు లేవేళను నేతిజుత్త లొక డబ్బేకాదు మృ.... 35

ఈ మమ్ముం గనిపాఱవేయుటయెగానీ పామరత్వం బటం
చేమీ పెట్టుకొనంగవైతిగద ! నీ కేలయ్య కైలాస, మీ
భూమిన్ సంతతి నింత యుంచుక సుఖంబో కష్టమో యేకమై
మేమున్ నీవును గూడి యుండె మనుటల్ మేల్గాద ? మృ.... 36

పద్దుల్ వ్రాసి గడించుకొన్నదెదియో పద్యమ్ము లచ్చందునన్
గ్రుద్దింపంగను దెచ్చిపెట్టి యిదిగో ! కూర్చుంటి, నాయొద్ద నీ
యొద్దంగూడను సర్వమంగళము, నాకో నీకో యీమీఁద నిల్
దిద్దన్ బాధ్యత వచ్చి తేల్చుకొనరాదే తండ్రి ! మృ .. 37

మొదలున్నట్టి యశీతివాతములలో ముఖ్యమ్ములైనట్టి వే
పది పైనో ననుఁ బట్టిచూచియును లాభంబేమిలేకే చెవిన్
గదపాయించుక వెళ్ళిపోయినవి, యీ కాలానకున్ జాలబె
ట్టిదమై యుబ్బసమొండె ప్రాణములఁ దోడెన్ దండ్రి మృ.... 38

ఏ చుట్టమ్ములఁ జేరుదున్ ముదిమి రానేవచ్చె, నీవైపుగన్
నాచూ పిప్పటిదాఁక పెట్టుకొని సంతానమ్మునే చూచుచో
నోచన్ దిన్నగ, నేడు చూచెదరు కాల్ నొవ్వంగఁ జేనొవ్వఁగా
నీచిత్తం బెటువచ్చునో యటులె కానీ తండ్రి మృ.... 39

సుడిగుండమ్ములఁగూడఁ దప్పుకొనుచున్ చుక్కాని లేకుండనే
నడిగోదావరి లోపలన్ బయనమ ట్లెన్నాళ్ళు సాగించెనో
గడుసంజొచ్చెను పాపికొండలను భగ్నం బేల గావింపకే
పడవన్ నిల్పితొ, ప్రాఁతనింక నొక చేవంజేతొ మృ.... 40

ఒక యాఘాతము మీఁద నొక్కటిగ నెన్నోయన్ని యీలాగు పం
పకమే, వీనికి నీవె కారణమొ నా ప్రారబ్ధమే హేతువో
ఇఁక నా ప్రస్తుత జీవితాచరణమే యీయింతకున్ మూలమో
సకలజ్ఞుండవు నాకొకింత యెఱిఁగించన్ రాదె మృ.... 41

పూలం బూజలొనర్చుచుండుఁగద యే ప్రొద్దున్, గతిఁ జెంగదా
కాలంబెంతయొ, యొక్కపల్కయిన పల్కంబోవె నీనోటి ము
త్యా లవ్వెక్కడ రాలునో పదిలమయ్యా ! యేటి నానీటిము
త్యాలేనీ యిటు చల్లనీ తపన చల్లారంగ మృ.... 42

వేళన్ నీకు నివేదనం జరిపి నీవే సర్వమైనట్లుగా
లోలో భావనచేయుచుండుటె మహాలోపమ్ముగా వేదనా
జాలం బైనది యింక జాలమయినన్ జ్వాలాకృతిం దాల్చెడిన్
మేలోయయ్య ! యింకైనఁగాని మఱి నీ మేల్కొంట మృ.... 43

పవళుల్ రేలును బగ్గుబగ్గుమనుచున్ బాధాసహస్రాల ఖాం
డవమట్టుల్ దహియింపఁగాఁ బడుచునుండన్ నాదుడెందమ్ము, తాం
డవమా నీకట నొక్కమై డమరుకధ్వానమ్ముతో, నీ వాకం
డవుగా కింకొక తండ్రి యెవ్వఁ డిటు చేయంగల్గు ? మృ.... 44

ఏఁడుల్ నిండినయట్టియాతఁ డిఁక పై నెన్నాళు లిందుండురా,
నేఁడున్నిన్నయటంచు గాదుగదరా నీజాడ గుర్తింప న
ల్లాడంజొచ్చుట, 'బారెడయ్యెఁ బగలెల్లన్నేను' నన్నట్టువై
యీడాడం బరిహాసపాత్రుఁడయిపోయెన్ వీఁడు ! మృ ... 45

సుకముం గష్టము నెంచిచూచుకొనురోజుల్ పోయి యేమౌదునో
ఇఁక నీ దేహమునుండి జారుకొనఁగానే కొఱ్ఱగింజంత యున్
పికరే పట్టి పలార్పుకాల మొకఁ డావేశించెడిన్ హస్తము
స్తకసంయోగముచేఁ గుదిర్చి పఱిఁజేర్చన్ రాద మృ.... 46

ఆఘాతం బిది యెంత తీవ్రతరమో ! యాత్మార్థమన్దానికే
వ్యాఘాతంబయి నిట్టనిల్చి కవనం బానాటి కాఘాలునుఁ
గాఘూఽన్ జదువంగఁబోయినది యీ కాసంతప్రాణాన నెం
తా ఘోషన్ నెలకొల్పినాఁడ, వెపుడో యంతమ్ము మృ... 47

## మృత్యుంజయ స్తవం

ఎండంగట్టగలేను దేహమును, నీవే కంటికిం గానరా
కుండన్ బుచ్చుకొనంగలేను నొకగా నొక్కండు ప్రాణాహుతిన్
రెండున్ రెండయిపోయె, తగ్గదెదియున్ లేజాయు నీనాటికిన్
నిండుం బ్రాణము కెంత వచ్చినదిరా నీవల్ల మృ.... 48

సరిలే మానవకోటి యీ వెలుపలన్ సంసారచక్రాననే
దొరలన్ లేకిటుబుండ, లో నొకటిరెండున్ గావె షట్చక్రముల్
వరుసన్ బేర్చి బిగించినావుగద యబ్బా! నాగపాశాలతోఁ
దరియింపం దరమౌనె నీకరుణచేతంగాక మృ.... 49

దాహంబాఱునె నీదు నామసుధచేతన్ మంచితీర్థమ్మనే
దేహం బుండెడిదాఁకఁ ద్రాగవలయున్ దీరన్ వలెగాని, 'దా
సోహంసోహ' మటన్న మాత్రాన మనుష్యప్రాణికిన్ దృప్తియే
'కోహంకోహ' మటంచు నిన్ను నిలవేయంబోక మృ.... 50

ఫలముల్ భక్ష్యము లెన్నియుంచినను మా ప్రాణానిలంబందునే
నిలుచు న్నీమనసంచు లో నెఱుఁగకే నీకేము చేఁజూపి ని
చ్చలు భక్షించుచు సంతసించెదము నిన్ సంతృప్తి నొందించిన
ట్లిల మా మానవజీవితమ్ము సకలమ్మిలాగె మృ ... 51

తొడుగ ట్టీడుచుకొంచు దేహమును ఎదో మొట్టికై చూచున
క్కడికే నాతల పట్టిపోయెదని, పైగా నూరకోలేక నీ
గొడవంగూడను గోరితెచ్చుకి యిటుల్ కూరాకు పైపోతి, నీ
పొడగన్పట్టనిమా నేమి మును గెంబ బోవోయి మృ.... 52

మే మిష్టంబయినట్టులన్ చెవుల తమ్మెల్ పట్టి యాడింప నీ
వేమో నిత్యమొనర్చు నృత్యమున నింకేదో విశేషంబుగా
లో మన్నించుచునుంటివేమొ యిదిపోలున్, బోలదేయున్న నీ
కామై దుర్విషమే గళాభరణ మెట్లౌనయ్యా మృ ... 53

లాలింపందొరకొన్నచో మకుటపిల్లల్ సైతమున్ విందు, రే
వేళన్ నేనిటు లెంచ వేడికొనినన్ వేంచేయ, వీకూడు నీ
నీళల్ నాకు హితమ్ముగా వెడుటగా నిపండు చేకుండినన్,
జాలింబెట్టగ నేమి నిమనిను పాషాణంబ ? మృ ... 54

ఉమ నీకిచ్చి వివాహమున్ సలిపినారో చెప్పు మా మేనకా
హిమవత్పర్వతరాజు, లేనటనసో నివామె జేపట్టి యా
యమచేతన్ సపతాలు గంగమనుమోయంజేయుచున్నాపు పా
పము ! దేహార్థ మొసంగిన ట్లౌసగి నేబాసయ్యా మృ.... 55

# మృత్యుంజయ స్తవం

నడువన్ నిత్యము పేఁడికోవలయునే నా కాళులన్ నేను, నా
నడతన్ దిద్దఁగ నంతరాత్మ పనుచున్ నాలోన నెల్లప్పు డుం
డెడి నిన్నెల స్మరింపఁగావలయునో నే, నన్నదే మిక్కిలిం
గడుసుంబాటెను, నన్ను నే నెఱుఁగు మార్గంబేమొ మృ.... 56

నీవేమో త్రిజగత్ప్రభుండ వనుచున్ నే నింతకాలమ్ము నీ
సేవంజేసితి, నేటికిం దెలిసివచ్చెంజుమ్మ నా సేవకే
నీవెల్లప్పుడు వేచి యుందువని, నే నేకాగ్రభావాన నా
యావద్భాగముమోసఁ జప్పినటు మోయంబోవ ? మృ.... 57

నీతోడన్ పిల్లల్ల పట్టుకొనుకంటెన్ నేటి యే తారతో
బాతాఖానిని బెట్టుకొన్నఁ గడచున్ బబ్బంబు రెన్నేని, నీ
చేతంబడ్డదియే మొదల్ క్రమముగా జీవచ్ఛవంబైతి, నా
వ్రాఁతన్ నే ననుకొందు నేమిటికి దూఱన్ నిన్ను మృ.... 58

ఈవే సృష్టియొనర్చుచున్నయెడ మ, మ్మిట్టూపులన్నట్టివే
రావేమో ! మఱి మాకుంగూడను గుమారస్వామియారోమ్ములో
యావిఘ్నేశ గజాననమ్ములో యవశ్యంబబ్బి మానుండి యె
న్నో విస్తారపుటూపు లేర్పడెడివేమో తండ్రి మృ.... 59

నాచేతన్ నుతియింపఁగాబడుఁటకన్నన్ నీకు గత్యంతరం
బే చూపట్టదొ, నిన్ను లోఁ దలచుకొంటేగాని యీపొట్ట రే
దో చందమ్మున నింత పిండమిడవో, యిందేదియుఁగాదు లోఁ
దోఁచున్ నీయెడ నాకెదో సహజ బంధుత్వమ్ము మృ.... 60

యమదాహం బగుచుండ చుక్కయును వేయండోక నా నాల్కపై
అమృతంపుఁ గలశాలఁ బట్టుకొని నీ హస్తాలఁ జూపింతు, వీం
తమహానిర్దయ యొక్క వైపునవే దక్కెంజుమీ, చూడి సా
టిమనుష్యుండెవఁడైన కోరువఁగలండే యిట్లు మృ.... 61

ఆభారం బటు మోయఁగానయిన మోయంబోయెదేగాని నీ
లోభం బెట్టిదియో సుధాకలశముల్ లోకాన కీ వెంతవే
నీ భాగ్యంబటె! యట్టి వెన్నొ తిరుగన్ సృష్టించుకోఁజాలవే
ఏ భోగాపురి బొల్లిమబ్బువిధమో యీపైతె? మృ.... 62

ఇగ నే నొక్క కణమ్ము ముట్టనుసుమీ యీ వల్ల కైలాసముం
దిగి నా యింటికి వచ్చి నాయెదుటఁ దండ్రింబోలి కన్పించి త
ల్లిగ నన్నుం దినిపించి నా పంకు చెల్లింపన్ వలెన్; గోరుకొం
డ్రుగదా బిడ్డలచేఁ బరాజయము తండ్రుల్ దేవ! మృ.... 63

## మృత్యుంజయ స్తవం

ఆనాఁ డెవ్వరొ పిల్చినట్టులఁ గ నా యాలాపనన్ వచ్చియున్,
రానేరానని మోడిపేసితివి తీరా కోరి నేఁడిట్టు లా
హ్వానింపన్, మఱి నీకునుం గలవె వేళాకోళ లీనాడు చం
దానన్, నీదియు మాది సర్వ మొక తత్త్వంబే కె మృ.... 64

బువ్వే పెట్టని కైతఁబట్టుకొని దేవుళ్ళాడఁగా లేక, నా
కెవ్వల్లన్ మఱి ప్రొద్దుపోక. బదులేమీ పల్కుచేతేని నిన్
రవ్వంబెట్టెద నాల్కకుం దురదతీరం దప్పు సైరింపుమీ
అవ్వంబట్టి వసంతమాడుదిటియేనా స్వామి మృ.... 65

సృష్టింజేసినయట్టి నీ వెటుల నన్ శిక్షింతువో చూతు నా
కష్టమ్మున్ సుఖ మింత పట్టదెటులో కైలాసమందుండు నీ
యిష్టమ్మున్ గనిపెట్ట బానిసనటోయీ నేను పుత్తుండ, నీ
వ్యష్టిన్ మాన్పి సమష్టికింక నిను నీడ్వంజొత్తు మృ.... 66

మ్రుగ్గందు న్నినుఁ బెట్టకుండ విడువంబోనోయి ! నీకోసమై
కగ్గం జిత్తమిదెల్ల నేఁడు చెవియొగ్గంబోని నీవే శిరం
బొగ్గంగావలె దేమొకో కడకు, రావో యింద్రి నాతోడుతన్
నెగ్గంగల్గినయేనిఁ గీర్తికరమౌనే నీకు ? మృ.... 67

పందెంబొడ్డితి వెన్కకున్ దిఁగుటన్ పల్కన్నదే లేదిఁకన్
బొందిన్ బ్రాణములుండుదన్క, గడువై పోవంగనే చూడు ము
క్కందాయాన నమశ్శివాయ యని నే గంఠంబు శంఖ్ఫితిన్
బొందింపంగనె నీకు నక్కడను జిఁదుల్గావె మృ.... 68

తంతుల్ లేకయు వానినే నడుపఁ జేతంగాకయుం గాదు, సా
మంతంబూనుట నీదు మంచితనమున్ మర్యాద దక్కించనే
ఎంతోదూరము పోవనేల 'ఉరువే యూపంచు చే' పన్న గ
ల్లంతున్ బెట్టినఁ జాలదే కదలు కైలాసంబె మృ.... 69

చింతంజేసెడునట్టి భక్తులయెడన్ జెల్లించుకోవచ్చు, నిన్
పంతంబెట్టెడునట్టి యీ కవులతోనా నీకుఁ బంతంబులున్
గింతంబుల్, వలదయ్య వట్టి రణపెంకెన్ జెప్పుచున్నాను, అ
ల్లంతం దీరెడుకార్యమింక నొక కొండం తౌను మృ ... 70

తిన్నం డంత తెగింపకున్నయెడ ఈతీరేగదా ! యాతఁ డా
కన్నాడంబెఱుకంగనే కుదిరె రోగంబంతయున్ నీ కదే
వన్నెన్ నన్నును దేకయే విడుతువా, వాఁడే నయంబన్నదాఁ
క న్నిన్నేనియుఁ దేకయే విడుతునా ? కానిమ్ము మృ.... 71

నౌవ్వంబల్కెడిదాఁక తెచ్చితివి, నిన్నుం బూలఁ బూజింతునే
యవ్విశ్వాస మిట్లు మాటెడినో వీరావేశముం దాల్చి నే
నెవ్వేవ్వో వెడలింపఁగా వలయునే యీనోట, రావోయి నా
కివ్వేళం గనుపింపవోయి సకలం బీడేరు మృ.... 72

ఉత్తు త్తన్ దలపోతెగాని మొదలీ వుంటేకదా యున్నదే
విత్తై, మొక్కగమొల్చి, వేళ్ళతలలన్ వేయుంగ నానాఁడు నా
చిత్తక్షేత్రమునందు ఖండపరశూ! ఛేదించి కాపాడు నీ
సత్తా నే డెటు పోయె? కానఁబడ దీషత్తైన మృ.... 73

నీకున్ గేవలమైన రూపమునకంటెన్ ఛాయగా నున్న యీ
లోకంబే ప్రియమంచుఁ దోచెడిని మాలో మా కెటో యట్టులే
నీకన్నట్టుదెమైన నేమడిగెదో నిన్ గూర్చియా, నీదు ఛా
యాకారమ్మును గూర్చియా తెలుపవయ్యా మాకు మృ.... 74

నిశ్వాసమ్ము నిశాంతదీపమటు తానే నిల్చు సూత్రమ్ము గ్రం
థాశ్వాసమ్ములలోన లేదు, మొద లీపం చొక్కఁడున్నాఁడ వ
న్నిశ్వాసమ్ముఁ గుదుప్పకోవలయుఁగానీ వట్టి తర్కాలచే
నశ్వంబ ట్లుడవిం బడందొడఁగునయ్యా బుద్ధి మృ.... 75

చేయంజేయఁగ నీదు నామజపమున్ చిన్మాత్ర నేర్పెస్తి చూ
చాయన్ దోచినయట్టి యప్పటి సుఖస్వప్నమ్ము నేఁ డెంతఁగా
నాయత్తంబయినన్ లవంబయిన లభ్యంబౌటయేలేదు, తం
డ్రీ! యే దెప్పటి కెంత ప్రాప్తి యిఁక సంతేకాదె! మృ.. 76

లే వీవన్న నిరాశ లేశమయినన్ లే దా మహావ్యాధిలో,
రావో లీలగ నాటిరే కలతనిద్రన్, కన్ను గన్పట్టవో,
నీవీ జాగ్రదవస్థనే యిపుడు నా నేత్రానకున్ రావెటన్
భావాతీతతఁ గట్టిపెట్టి యిదె నా పంతమ్ము మృ.... 77

వెలిపన్నట్టిదె పోయి చూడ మిసలన్ వేద్యంబ్యో పిట్టసుం
దరియై మృత్యువు నాఁడు కళ్ళయెదుటన్ నాట్యమ్ము సేయంగ, ఎ
నెఱసో నే ననునట్టి చప్పటిఁగతిన్, నీవెంతలోఁ డేసి తా
యెఱుకన్ నన్ బ్రతికించినాఁడవను పేరెగాని మృ .. 78

ఒకనిన్ మించిన యోధుఁ డింక నొకఁడయ్యున్ జంపనేలక చం
పుకొనంజొచ్చిరి రోషవేషముల నా మూలమ్మునంజేసి, సి
దు కృపాలోకన మా శనిన్ గుణసమేతున్ సౌమ్యుగావించి పా
పికె పాపం బనిపించు పాఠమును మెప్పింగాదె మృ.... 79

ఎన్నండో సతి నన్ను బాసినను నా కేనాటికానాటికే
నిన్నవ్వేడనిపించుచున్న వ్యథతో నెయ్యం బవిచ్ఛిన్నమై
యన్న్యోన్యమ్మునఁగూడఁ దియ్యదనమే యంతంతకుం దోఁచు ర
మ్మన్నన్ మృత్యువునైన మిట్టులె ప్రియంబౌనేమొ మృ.... 80

నా యందమ్ముల హంస యేమయిన గానన్ వచ్చెనే నీకు, నె
న్నో యేండ్లయ్యెను తప్పిపోయి, యొకటెక్కోటముక్కోటకాకుండఁ ద
త్కాయంబంతయుఁగూడ స్వర్ణమయమై కైలాసమందున్నయ
ట్లే యూహన్ స్ఫురియించుచున్నది నిజంబే తండ్రి ! మృ.... 81

పోసి యేతరుమూలమందొ యొక పూవుంబోఁడి నాయందునన్
ధ్యానంబుంచి తపింపఁ జూచినటులైనన్ దృష్టికిం బాయునే,
నే నింకన్ జనుదేరలేదె యనుచున్ నీర్వెట్టునే కంట, నీ
మౌనంబే మది కానగొల్పెడిని సుమ్మా ! నాకు మృ.... 82

ఏసౌఖ్యమ్మునుగాని యాస లెవిగానీ లేకె నాతోడనే
యీసర్వమ్ము ప్రపంచమున్నయటుగా నేఁ జేర నచ్చోటి, కిం
తేసూ ! యీ మనుజస్వభావము విషంబేనీ విడంజాల ద
ఖ్యాసంబయ్యెడిదాఁకగాని నిజమయ్యా ! తండ్రి ! మృ.... 83

ఏదో జీర్ణించినయట్టి వ్యాధియయి పై నెవ్వాని చేపల్వానో
కుదురన్ సంతసమందిగూడ ఒది తాఁ గోల్పోయి యున్నట్టులన్
వెదకిన్ జొచ్చెడి ప్రాణి వీడఁగలదే పిష్టమ్ము నెన్నేఁడులో
కుదుటంజేసుకయుండి, నీవె యెప్పుడో కొంపొమ్ము మృ ... 84

ముదిమిన్ గాయము రోఁతవేయుచునె వ్యామోహమ్ము గల్పించుచు
న్నది, చేదేనిఁ దినందినంగఁ గడుఁ పీయుందీయనౌ రీతిగన్,
బ్రటు కెంతేనియు భారమయ్యు నిదియే బ్రహ్మాండముల్ నిల్వ నా
స్పదమేమో యనిపించుచున్నది మహాశ్చర్యమ్ము మృ.... 85

వెడలింపంబడి ప్రాణ మింక నెవటో వేటే స్వరూపమ్ముతో
నొడలిందాలిచి యుండియున్నదియొ యీయుర్విన్ మఱింగాక నీ
యెడ జీర్ణించి జితించిపోయినదొ, నాకెవ్వా రెఱింగింపఁజా
లెడివా రా సతిగూర్చి యెంతకును జాలేలేద మృ ... 86

కడకీ దుగ్ధసమేత మామెకు నెఱుంగన్ రాదొ, నాకేని యీ
యొడలన్ బ్రాణమటంచు నుండువఱకేనో యేమొ, జన్మమ్ము లీ
బడి నెన్నయ్యెనో యింతకున్ మునుపు మాప్రాణాలచే నీదఁగాఁ
బడ జన్మమ్ము లికెన్ని యున్నవియొ చెప్పన్రాద? మృ.... 87

కానీ, చాయయెకాక యొక్కయెడ ఆ కస్మికత్కృతికేనియుం
గానన్వచ్చియుఁగూడ భేదపడియెం గంఠస్వరం, బట్టిచే
యీసీసృష్టిని దేనికయ్యదియె ప్రత్యేకత్వముం జెందునే
ప్రాణిప్రాణియుఁ, జిత్రమెంతటి ప్రభావంబయ్య మృ.... 88

ఒడలిం గాలిచివేసు భస్మమయి యెందో యెందునో చేరకై
పడి జీవాణువుకేని దేహ మిది పోవన్ జన్మ మున్నప్పుడుం
దెడి కర్మానుగుణమ్ముగాఁ జనెడినో నీవస్పుచే నెక్కడె
క్కడికో. సృష్టికి నిత్యనూతనత ఆకల్పింప మృ.... 89

బొందిన్ దోచ్కొనిపోక ప్రాణమునె కొంపో లాభమేముందునో
యుంచి భూమిని ప్రాణవాయు వెటులో యీ మేము జీవింప మా
యందుం గల్గినయట్టి ప్రాణమును నీ కష్టమె భావింప, ము
న్నుంచీ హింసయటంచు నీయెడనె యుత్పాతమ్మె! మృ.... 90

ఒక నిత్యున్ సృజియింపలేవయితి నిత్యుండన్న పేరున్నయం
దుకు, నీకీ యిహాలక్షణం బెఱుఁగరాదో ? కీటకంబేని కీ
టకమున్ సృష్టియొనర్పఁగాఁ గలిగియుండం గావలెన్, బాల్యపా
లకసంబంధము శక్తి చాల కెటు నిల్వంజాలు మృ ... 91

నీ వాలాగున శాశ్వతుండ వగుచున్ నీవల్ల జన్మించు మా
కే వల్లన్ ఘటియిల్లుచున్నవొ కదా ! యీచావు లీపుట్టుకల్
మావల్లఁ జనియించువారల కిఁకఁ మాపై ఖరుల్ రాఁగ నే
లా వర్తింపదొ నీదు మాదునెడ నీయంశమ్ము మృ ... 92

గతకర్మానుభవమ్ము దీఱఁగనె యీకాయమ్ము త్రిప్పించి ప్ర
స్తుత కర్మానుభవమ్ముకోసము మఱేదో కాయముఁ జూతువో
ప్రతిప్రాణమ్ము ప్రపంచవాసనలు దీఱఁ బైనిఁ కేనాదొ నీ
గతమై లీనతనొందునేమొ పరమాకాశాన ? మృ.... 93

ఒక యుచ్ఛ్వాసముతోనె ప్రాణములనెన్నో మాటికిఁ నీవు లో
నికి గొంచుఁ ఘనికన్నిటిఁ విడుతువా నిశ్వాసరూపమ్ముగా
నకలంకా ! విషవాయువు గ్గొనుచు మాయందుండి వృక్షమ్ము లె
ట్లిక మాకిచ్చునొ శుద్ధవాయువుల నీ విట్లేన ? మృ.... 94

చూడంజూడ మహాశ్మశాన మనిపించుఁ నాకు నీలోక మిం
దేదఁ గాలిపఁబోవ నేరిపయినో యే వేయుచున్నట్లులే
లో శక్యమ్మెద్దిఁ గాని [illegible]మహిమ [illegible]యాలోనే నివారించి నీ
శ్రీ[illegible] స్తుతిం గీలించు మృ.... 95

ఆభూతమ్ములతోనె యున్నయెడఁ గావన్నారె యేరైన? నీ
వీభూమిఁ బరపంచిసంతతిని నేఁ డీఁచంగఁబోనందువే
నీభారమ్ము వహింప నింక నెవఁడో నీవుబ్బ యున్నట్టులన్
లాభంబేమియు లేదిఁకన్ దిగుము కైలాసము మృ ... 96

పోమో, రామొ యిహమ్మునం దిరిగిరాఁబోకుండఁ గొంపోదువే?
యీ మమ్మందఱ నెత్తిఁ బెట్టికొని యూరేగంగ నెంతున్నదో
యేమో, ఆపరలోకమున్ దెలుగునో యీవిచ్చు నాజ్ఞావిధిన్
మా మా ప్రాణులతోడి పాటుగనె మర్మంబేమొ? మృ.... 97

ఒక కన్ గ్రుడ్డుననున్న నీలిమను సూర్యున్ జంద్రుదు సర్వప్రపం
చకమున్ రేవగ లొక్కమైఁ బ్రతిఫలింపం జేయుదేకాక త
త్సకలక్రీడ యనంటిపం డొలిచి చేతంబెట్టుచున్నట్లు దృ
ష్టికినిం దెత్తువు భక్తకోటి కొకఁడడ్డే నీకు మృ ... 98

నిలువన్ బ్రార్థనచేయుచుండిన కొలందిన్ సౌఖ్యమే కష్టమై
తొలగింపంగ యతింపనున్న కొలఁదిన్ దుఃఖమ్మె సౌఖ్యమ్ము కాఁ
గలదేమో కన! యెందు కేర్పడిన తర్కంబున్ వితర్కంబు, లీ
యిలనే స్వర్గమొనర్చు స్వర్గమణివై యీవుండ మృ .. 99

ఇహమందున్ బరమందు నొక్కగతిగా నిష్టమ్ము గల్పించుచున్
బహుళార్తిన్ దొలఁగించిపైచినది నీ పంచాక్షరీమంత్ర, మా
మహనీయంబగు స్పర్శవేధి యనుచున్ మాకుండినన్ జాలఁ బ్ర
త్యహముంబాయక, యేది యింక నినుఁ గోరఁబోము మృ ...100

నీ నామమ్ము జపమ్మొనర్చిన కొలందిన్ విశ్వగానమ్ముగా
నానాటన్ బరిణామమొంది యటుపైనన్ బ్రహ్మగానమ్ముగా
రానున్ రాను ధ్వనించి ఘోస నిపు డుచ్ఛ్వాసంబు నిండెందునన్
లీనంబౌటకొ, తృప్తి యాత్మ కెటులన్ లేదయ్య మృ.... 101

ఆ కన్పట్టిన ధ్యానముద్ర భవదీయాలోకనావాప్తిచే
నీ కన్గప్పెడి యోగనిద్రయయి తండ్రీ! చిత్త మీనాటికిన్
లోకం బేదొ యికొక్కలోకమయినట్లున్ బొందికైలాసమై
వైకుంఠం బరచేత నున్నయటులన్ వర్తించు మృ.... 102

నాలోఁ గొన్నిదినాలనుండి యెవఁడో నాగస్వరం బూదుచున్
మూలాధారమునే కదల్చెదిని, తన్మూలమ్మునం జేసి కాఁ
బోఁచున్ శ్వాసయె యాడఁగా దొడఁగు నెప్డున్ దేవతాసర్పమై
పాపంజూడఁగ నీవె యిందుకు గతంబోయేమొ మృ.... 103

పటాటాముల్ పడుకారణమ్మనవో, నీపై నొక్కచే ధ్యాసనో,
చలసంబన్న దెపోయి స్థాణువుగ నీ చందాన నిల్చెన్ మన
శ్శిల, స్థాణుండ వీ వావహింపుము ప్రతిష్ఠింపంగ నీపేరునన్
గలుగంబోవునొ యేమొ పూజలు పురస్కారాలు మృ.... 104

ఎల్లన్ నీవయిపోయి, నీవు తలపై ఏచిన్ని పువ్వట్లొ జా
బిల్లిన్ దాలిచియుండ, వెన్నెలలుగా విశ్వాన నీకాంతులే
వెల్లింగొల్పెడునట్టు లున్నయవి యీ వేళావిశేషమ్ముచే
వెళ్ళంబుచ్చకు దీని, నింక మనసే వేఱయ్యె మృ.... 105

లోకమ్మందునగాక వెన్నెలలు లోలో గాయునట్లుండె, న
య్యాకాశమ్మనునున్న జాబిలియు నాయందున్న డెందమ్మ ని
ప్లేకాకారతనొంద నేమిగతమో, యీ యాత్మ సంబంధమున్
నీకా పుణ్యముచేత నేర్పడుటగానే తోచు మృ.... 106

నా పంబోలి ప్రయాణమైనది మహానంద ప్రవాహమ్ములో
భావం బెచ్చటికో, కనుల్ పగిలిపోవంజొచ్చు ధావళ్యమే
లావణ్యం బతిగణ్యమే యెటులు కైలాసమ్మొకో బొందినే!
కైవల్యమ్మొకో జీవముండగనె! నిక్కమ్మొక్కొ! మృ.... 107

ఏరో వెన్నెలచీకటుల్ కలిసిన ట్లీ పర్వతాగ్రాన ను
న్నారే, యొక్కరిలోన నింకొకరు లీనంబౌచు నున్నట్టులన్
వేఁబౌచున్నటు గానుపించెదరు కానీ వారికేవారు ప
ట్టీరే! యాదిపురాణదంపతులుగారే వారు మృ.... 108



## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కాంతం కైఫీయతు | 1 | 0 | 0 |
| 2 | కాంతం కాపురం | 1 | 0 | 0 |
| 3 | కాంతం | 1 | 0 | 0 |
| 4 | నేనూ మాకాంతం | 1 | 0 | 0 |
| 5 | మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | 0 |
| 6 | మునిమాణిక్యం కథలు | 1 | 0 | 0 |
| 7 | ఉపాధ్యాయుడు | 1 | 0 | 0 |
| 8 | తిరుమాళిగ | 1 | 0 | 0 |
| 9 | మేరీ కహానీ | 1 | 0 | 0 |
| 10 | దాంపత్య జీవితం | 1 | 0 | 0 |
| 11 | రేడియో నాటికలు | 1 | 0 | 0 |
| 12 | రాధబాబు | 1 | 0 | 0 |
| 13 | శరద్రాత్రులు | 1 | 0 | 0 |
| 14 | రుక్కుతల్లి | 1 | 0 | 0 |
| 15 | యదార్థ దృశ్యాలు | 1 | 0 | 0 |
| 16 | హాస్యకథలు | 1 | 0 | 0 |
| 17 | తల్లిప్రేమ | 1 | 0 | 0 |
| 18 | కథానికలు | 1 | 0 | 0 |
| 19 | దీక్షితులు | 1 | 0 | 0 |
| 20 | తగూ నెం. త్రీ | 1 | 0 | 0 |
| 21 | వినోద వ్యాసములు | 1 | 0 | 0 |
| 22 | నా స్నేహితులు | 1 | 0 | 0 |

## శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఉమర్ ఖయాం | 1 | 0 | 0 |
| 2 | బృందావనం | 1 | 0 | 0 |
| 3 | శబరి | 1 | 0 | 0 |
| 4 | పంచవటి | 1 | 0 | 0 |
| 5 | శృంగార చాటువులు | 1 | 0 | 0 |
| 6 | మృత్యుంజయం | 1 | 0 | 0 |
| 7 | సుభాషితము | 1 | 0 | 0 |

## శ్రీ వేదాంతకవిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కెరటాలు | 1 | 0 | 0 |
| 2 | కవితా సంస్థానం | 2 | 0 | 0 |
| 3 | అవ్వాయ్ చువ్వలు | 0 | 12 | 0 |
| 4 | దండయాత్ర | 1 | 0 | 0 |
| 5 | వరదలు | 1 | 0 | 0 |
| 6 | గడ్డుగ్గాయి | 1 | 0 | 0 |
| 7 | చిసరసాలు | 0 | 8 | 0 |
| 8 | భగవన్మతభాష్యం 1 వ భాగము | 1 | 4 | 0 |
| 9 | డిటో 2 వ భాగము | 1 | 0 | 0 |
| 10 | నాయుడుబావ | 1 | 0 | 0 |

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి